మఱొకగొల్లమాట:—వోరె అల్లబక్కలావాటివాండు, పొట్టిపొడుగాటివాండు, వొకకన్నువ్వూనం వొకకన్ను తెలియదు, చెవిటివాండు, కాలుకుంట్టుతా వచ్చునే నిమ్మపండ్లువలె నల్లనిబొంపండు వాండురా ॥ ౪ ॥

మునుపటిగొల్లమాట:—వోరెవోరె ఆబాపణ్ని యేల వాకిలి విడిస్తివిరా, వానిచేత నేమైనా పరకాలు నాచుకొంట్టివో. దివాళికి రూకా, పొంగటికి రూకా, వుగాదికి రూకా, తలమూయ పాఁతా, ఆముచ్చుబొంపండు రాని కాళ్లె యిరగ్గొట్టిగాని ॥ ౫ ॥

వోరెవోరె చినబొమ్మ యీాడ యేంట్టిరా గుంపు ॥ ౬ ॥

మఱొకండు:—వోరె వీండ్లె విద్యావస్తులురా ॥ ౭ ॥

మునుపటివాఁడె:—వోరె నిత్యాపస్తులా, అయితే నామీాంద వొకపదం వింద్రా.

౮. కూనలమ్మ పెద్దకొడుకు గొల్లమల్లుగాండు, బోనపుటికె యిరుచుక తినేరా పోతరాజువలెను.

మాట:—వోరె చినమల్లుగ అల్లవాండె మద్దెల కోరుకుతావుండ్డాండె తమ అబ్బడితరమా ॥ ౯ ॥

వోరె వోరె అల్లవాండు నాగసరం మింగ్గుతా వుండ్డాండు గొంత్తువబడేనేమో చూడరా ॥ ౧౦ ॥

వోరె అల్లవాం డెంద్దిరా అబక చాతం బట్టికిని వచ్చివుండ్డాండు ॥ ౧౧ ॥

వేఱొకనిమాట:—వోరె అది అబక కాదురా. తంబ్బురంటరా ॥ ౧౨ ॥

అమ్మతోడు తంబురా అది అట్లాం జెప్పరా తంబూరా ॥ ౧౩ ॥

వోరె వోరె అదెందిరా గణం మణం గణం మణం అనేది ॥ ౧౪ ॥

వేఱొకనిమాట:—వోరె అది తాళం రా ॥ ౧౫ ॥

యేమి ఆదితాళమా, అందుక్క మేముతాళం ॥ ౧౬ ॥

వోరె వోరె ఆమద్దెలలోనుండ్డి మాట్లాడువాం డొంద్రా ॥ ౧౭ ॥

వోరె ఆమాట్లాడు వాండ్లు వాళ్లుదా ॥ ౧౮ ॥

విద్వాంసుం డాడేమాట:—వోరె మల్లుగ, యేలినవారు కొలువైవున్నారు, మంచిసమయం దాన మడుక్కునేము విడువరా ॥ ౧౯ ॥

గొల్లమాట:—వోరి నీకు దాన మియ్యకుంట్టె నేమి మరొక బొంపండి కిచ్చేరు పోరా ॥ ౨౦ ॥

అట్లా యేల అనేవురా నీకు అమావాస్యనాడు కూడు వేశేమగాని విడువరా ॥ ౨౧ ॥

గొల్లమాట:—అయ్యా మీకు బాంపలేనా మాయింట్లో కూడు తినరో ॥ ౨౨ ॥

విద్వాంసునిమాట:—వోయి మేము బాంపలముగాదమవోయి మీయింట్లో కూడు దిండ్దుమా ॥ ౨౩ ॥

గొల్లమాట:—అట్లాం జెప్పవోయి, అయితే వోరె వోరె యీపట్టె నామాలబట్టమయ్యను విడువరా వోరె, అల్ల జుట్టువాండు వుండ్డాండె వాండు మాయూవాది బాపలకొడుకు, కర్రలు యేశి యిరికించ్చి నడ్డి యిరగ వడ్డించ్చరా వోరి॥ ౨౪ ॥

వా. అనిన విని వారి పారుష్యంబులు వినలేక కాలుష్యంబున దొమ్మిసేసి యొమ్ముగా నిలిచి దుముదారుగా నడచి యాగొల్లం బడఁద్రోసి విచ్చనవిడిగా వచ్చిరఁట యెటువలెను.

వా. ఇవ్విధంబున వచ్చియచ్యుతవిజయరాఘవధరాధినాథుని చెంగటంగూర్చుండి మంగళాశాసనంబు సేసిరఁట యెటువలెను.

మంగళానిభవంతు అంగజసరూప! అఖండిత ప్రతాపోస్తు చండకరతేజ! దీర్ఘాయురస్తు తే దీనమందార.

వా. అని నానా ప్రభంగులుగా విద్యాప్రసంగంబు నడపించిరఁట యెటువలెను.

శ్లో. ఔదార్య మంగనృపభంగ విధానధుర్యం
శౌర్యంచ ధైర్యమపి శౌర్యపలాలనీయమ్
రూపం చ పంచశరవీరవిలోభనీయం
యస్యాస్త్యహో విజయరాఘవసార్వభౌమ ॥

చూర్ణిక. అయం కిల సకలమహీపాలమకుటోపలాలితచరణకమలయుగళో వీష్ణేవ విశ్వవిశ్వంభరస్య, విభావీవ భాషాపతే రనువాదఇవ రఘునాథస్య సంవాదఇవ సంవరణస్య ప్రవాదఇవ భార్గవస్య ప్రతిచ్ఛంద ఇవ హారిశ్చంద్రస్య ప్రత్యాదేశఇవభరతస్య ప్రతిబింబమివ చంద్రబింబస్య మూర్తిభేద ఇవ కార్తవీర్యస్య వికల్ప ఇవ కల్పపాదపస్య ద్విరుక్తి రివ దిలీపస్య పునరుక్తి రివ పురూరవసో విరాజమానో, న కేవలం చంద్రఇవ శీతలః తపనఇవ ప్రతాపశీలో, న కేవల మింద్రఇవ భోగీ త్యాగీచ ధనదఇవ, న కేవల మనుకూలో రామఇవ కృష్ణఇవ దక్షిణనాయకోపి, ఇందురివ కువలయానందక

కరో నందకరణిన పరితోషితగోపాలః, సంగీతసరస్వతి, సాహిత్యభోజ, సంగ్రామగాంగేయో వితరణజితరాధేయో విలాసినీజనమోహనరూపధేయో విజయసారథిభాగధేయో విజయరాఘవనామధేయో రాజాయ మధివసతి రాజధానీమ్.

చూళిక—ఖుసుళవిళోభణ మధణే । యాభకరఘుణ ధొవ్వసాధపాయేసో భాహభళభళపద్దో । అరవికారయ వియయరాఘవో వియయ ॥ ౧ ॥

అపభ్రంశము—పుణుకావిగోడితుంహే । దత్తూణ మణేణ్ణ రూపు అసమాణు తాయియ నిబ్భరవిరహా । స్పహోవు మణ్ణారుదాసు భూపాళు ॥ ౨ ॥

ప్రాకృతము—భద్దం దేయు పుణేతుహ చంపయ రణ్ణప్ప యేససంచాళో హారిద్దణంయుతిడుజ్జ్వల సుందిరవిహాయిరాయు రాయగోపాళో ॥ ౩ ॥

పైశాచి—సౌవజ్యో గుసవంతో బహ్మసహచ్చానుపూళసద్దమహాదానో నార్య వెన్ను సమానో ళోకవిళోకస్స పున్నినుచందో ॥ ౪ ॥

శౌరసేని—విదదయసో వత్తిదిసో । జయయి సుహద్దణ్ణిదోయేసో కణ్ణపరభత్తి సీళో ఋణ్ణారుదాసో మహీపాళో ॥ ౫ ॥

మాగధ—పుశుపశరాశన శరిశే రూవేణ హారియ్య మహీమాయే దాణేహిం రాహేయే వియయయి రహుణాహశామిసంతానే ॥ ౬ ॥

దేశి—తివాఘవణకర్తారు తుమం ధణేసుదాతారు గాణబయుకారు సమరహాళబ్బాళదు నెదారు మహోదారు మన్నారు ॥ ౭ ॥

డిండిమము—కాంచివల్ల ద్వలగ్నకం । ప్రాంచదుచ్చ స్తనద్వయం కాచి దంబుజలోచనా । రఘునాథనందన నాథ తే త్వామ్ ॥ ౮ ॥

రూపకతాళము:——చందనాచలకందరోదర మందమారుతబృందసోదర నందకోవిదనంద్య సద్రసతుందిలోదితకందళోజ్జ్వల ॥ ౯ ॥

వర్ణము—లలితస్వభావ కలితప్రభావ రిపుభంగకృతిచంగ రణరంగభీమ దినప్రదానప్రదాన ప్రధావిప్రహర్షణోజ్జ్వలా విజయరాఘవ ధరాపురందరా

శ్లో. భునక్తు వసుధాతలం విజయరాఘవక్ష్మాపతిః
వ్యనక్తు కవితాస్థితిం విజయరాఘవక్ష్మాపతిః
నయం వ్రజతు మానవం విజయరాఘవక్ష్మాపతిః
శ్రియం భజతు సర్వదా విజయరాఘవక్ష్మాపతిః ॥ ౧౧ ॥

శ్రియం భజతు సర్వదే త్యత్ర లిఙ్ లోట్ తవ్యప్రత్యయానాం విధాయకత్వాత్ సార్వైశ్వర్యసిద్ధతయా పునర్విధానం కథం సిద్ధసాధనత్వాత్ । విధే రజ్ఞాత జ్ఞాపకత్వాత్.

కిముచ్యతే భోక్తా భునక్తు వసుధాతల మిత్యత్ర "ఐంద్రంపదం భూమిగతో నభుంక్తే" ఇతిరఘువంశప్రయోగానుసారేణ ఆత్మనేపదే ప్రయోక్తవ్యే కథం పరస్మైపదప్రయోగః.

అత్రేద ముత్తరం భుజోనవన యితి సూత్రానుసారేణ అనవనార్థే త్యాత్మనేపదవిధానా. న్నాయ మాక్షేపః।నచ వాచ్యం। తర్హి తత్ర కాగతిరితి। అత్ర అనుభుంక్తే అనుభవతీత్యర్థః తథాచ న దోషః.

మాట:—అవునోయి యెషువంట్టి భ్రాంత్తుం డయినా యిషువలె భ్రమసుకొనునా। భుజిధాతువుకు అనుభవ మర్థ మని యెషువలె చెప్పచున్నావోయి ॥ ౧ ॥

వజ్రశుంఠ మల్లుభట్టిగాండు యేమోయి అనే అట్టు ఆయనా నాబ్రదుకు॥
యిషువంటి బ్రహ్మిష్టోబ్రష్టు కొడుకును యేమోయి అనవచ్చునా
వోరి నీవలె వుభయతో బట్టి ప్రాయశ్చిత్తం చేసుకోకవుంటి నమరా ॥ ౩ ॥

వోరీ నీవు పుట్టి మూం డాయిత్తారాలు లే నిన్నటి సుడుపడవు।నావంట్టి యోగ్యుణ్ని జూచి యేమి వదరేవురా శునకం వలె। పాదరక్షలు తీసి రెండు ప్రహరింత్తుమో ॥ ౪ ॥

వోరి వృద్ధగార్దభమా। నోరుగల దంచున్ను నెత్తినోరు బెట్టుక కూయ వచ్చినాండవు। కపోలతాడనం శేతునో।త్వమేవ గార్దభః ॥ ౧ ॥ త్వమేవ శునకః॥ ౨ ॥ త్వమేవ సూకరః ॥ ౩ ॥

వా.అనిన విని నృపాలుం డే మనుచున్నాఁడు.

నాయనిమాట:—తాళరోయి యేలకూశేరు.

విద్వాంసుఁడు:—పః పః పః పరాకా। రాఁరారాముకి సిసిసిసీత యేంగావలెను.

నాయనిమాట:—భళానోయి మంచ్చాక్షేపం।యేమి అంచ్చున్ను వుంటిమి యిటువంట్టి యెత్వమా నీవు.

వా. అని యొకనిం జూచి చేసన్న చేయఁగా నే మనుచున్నాఁడు.

మాట:—ఔ కుంభకర్ణునికి భీమసేనుండు యేంగావలె.

పాః పాః పాః పాః ప్రప్రప్రప్రతిబంధి పట్టుచున్నాండవు.

⟶ లయగ్రాహి. ⟵

భావమునసిన్నుఁ గులదైవతముగాఁదలఁచి సేవయొనరించు విబుధావళికి నెల్లన్
శ్రీవిజయలాభములు భూవిదితకీర్తులును దేవపతిభోగమును ధీవిభవముల్ దం

తావళసమూహములు తావులతురంగములు కావలయు గ్రామములు వేవగలసొమ్ము
లీవిగఁడుఁగల్గుధరణీవలయమందు నవురా విజయరాఘవ మహీవరవరేణ్యా ॥౧॥
తావిజగజంపుసిగపూవులసరుల్తళుకుమోవిపలుగెంపుబురుసావలువసొంపు
లీవిదులకింపనొకతావి చురుకున్నరుతు మావుపయినెక్కి పురిలో వెడలిరాఁగా
నీవగలుఁజూచి చెలి రేవగలుఁజొక్కుచును బూవుజముదాడిదొరహావళికిఁజిక్కె
న్నా వెలఁదినేలుకొనరావలదె నీవుదయతో విజయరాఘవ మహీవరపరాకా-

క. భూతలమున శిబికర్ణులు, దాత లనే సుద్ది సుద్దబ్బఱ వినఁగం
చేతఱ వదాన్యుఁ డెవ్వఁడు, రా తంజావూరివిజయరాఘవనృపతీ.

వా. అని యీవిధంబున నానావిధలౌకికవైదికప్రసంగంబులు నడచుచున్న సమ
యంబునఁ బుడమితేఁడు గడియ లడుగు మనెనఁట యెట్లువలెను.

నాయనిమాట:—ఘడియ లడగరా.

అణ్ణాగళుమాట:—ఘడియారం ఘడియారం.

వా. ఆసమయంబున గడియారమువాఁడు వచ్చి గడియలు విన్నవించెనఁట యెట్టు
వలెను.

శ్రీరాజగోపాలస్సహాయః। ఘడియలు యిరువయి.

వా. అనిన విని యవనీశ్వరుండు దిగ్గున లేచి యగ్గలిక మీఱ మన్ననారుల సన్నిధిఁ
జేరి సన్నుతిచేసి పల్లవాధరలు గొలువఁ బల్లకి యెక్కి యుల్లంబు రంజిల్ల
మెల్లమెల్లన భేరీమృదంగపణవపటహముఖరవఢక్కాహుడుక్కాది వాద్యధ్వ
నులు డక్కటిగాహంబులఁ బిక్కటిల్ల నందంబుగా వందిమాగధబృందహృ
ద్యానవద్య గద్యపద్యారావంబులును భూనభోంతరాళంబుల బొదుకలంగ
రాజాధిరాజులు కైజీతంపుపౌఁజులు నెన్నందగు మన్నెదొరలు నసమానుల
సమానసాహసంబున మీరుహాసము వారును నద్వంద్వులగు విద్వత్కవులును
జాణ లగు గాణలును బ్రవీణు లగు వైణికులును నటచేటపీఠమర్దవిదూషకులుఁ
గొలువ నగరప్రవేశంబు నటించిన సమయంబున విలాసవతి వచ్చెనఁట
యెట్టువలెను.

దరువు, సైంధవి - ఆదితాళము.

గజనిమ్మపండు చేకానుక పూని విజయరాఘవునిజేర విలాసవతి వచ్చె.

వా. ఈవిధాన వచ్చినవిలాసవతి దగ్గఱ నున్న యొకానొక హెగ్గడినిం జూచి
యేమనుచున్నది.

విలాసవతిమాట - వో యక్క మీ యేలినవారినను యే మక్క, విలాసవతి వచ్చె నని విన్నపం శేయవక్క.

వా. అనిన విని యగ్గలిక మీఱ హెగ్గడికత్తె యేలినసామితో నేమనుచున్నది.

హెగ్గడికత్తెమాట — వో సామి యెవరో విలాసవతి యట వచ్చినానని యిన్నపం శేయును నె.

వా. అనిన విని యానీశ్వరుం డేమనుచున్నాఁడు.

నాయనిమాట -- అవును మంచిదే పిలవ్వో

వా అనిన విని హెగ్గడికత్తె యే మనుచున్నది

హెగ్గడికత్తెమాట - రావో విలాసవతి యేలినవారు పిలిచేరు.

వా అనిన విని వారిజాక్షి చేరవచ్చి యే మనుచున్నది.

విలాసవతి — మొక్కేను మొక్కేనయా చక్కని మన్నారుదాస.

వా. అని యాగజయాన విజయరాఘవధీరునికి గజనిమ్మపండ్లు కానుక యిచ్చిన నామేటి యాంబోఁటినిం జూచి యే మనుచున్నాఁడు.

దరువు — ఎవరంపఁగా వచ్చితి వెవ్వరిదానవు, జనరాల తెలుపవె జాగు సేయకను॥
నినుజూచినంత నెమనసు చల్లనయ్యాని, వనజలోచన నీవువచ్చినపని యేమి॥ ౧॥
రాకేందువదన నీ రాకమాకొకమేలు, చేకూర్పవచ్చిన చెలువునఁదోఁచె ॥ 3 ॥

వా అనిన విని యానవఁబోణి యే మనుచున్నది.

విలాసవతి చదివే పద్యం.

సీ. శ్రీరాజగోపాల శౌరి చెంగమ్మయు గరుడవాహన మెక్కి కదలిరాఁగ
రాజచంద్రునిపుత్రి రాజబింబానన యలకాంతిమతి చూచి యపుడు మిమ్ము
నారాత్రి కలలోన నక్క ఱమీఱంగఁ గలసినయట్లుంటఁ గలఁగి మిగుల
విరహాంబుచే సొక్కి మరునికాఁకకు స్రుక్కి మనను నీపైఁ జిక్కి మమత హెచ్చఁ
బ్రాణపదమైన నన్నుఁబిల్చి పద్మగంధి, స్వామికిని దెల్పు మనుచును సంగఁబనిచెఁ
గాంతిమతి చెలువంబు నేఘనతమీఱ, విజయరాఘవ తెల్పెద వేడ్క వినుము.

వా. అని వెండియు నా వేదండయాన యామండలాధిపునితో నేమనుచున్నది.

విలాసవతి చదివేద్విపద.

అయింతి మరుదంతి యంగరులబంతి, కాయజుచికటారి కలికి మిటారి
ఘనసీలవేణి పంకజమృదుపాణి, విరులికెక్కిన మొల్లవిరిఁబోణి యల్ల
కమలాక్షి పాలిండ్లు గజనిమ్మపండ్లు, విమలాంగి కరములు విరులసరములు
కలకంఠి గళము చొక్కపుశంఖకులము, చెలువకర్ణంబులు శ్రీవర్ణము లగు

హారిణాక్షి కెమ్మోవి యమృతంపు దీవి, తరుణిపల్కు దురు కుందమ్ముల నెదురు
వామాక్షిముక్కు సంపఁగిమొగ్గనిక్కు, భామినినేత్రముల్ పద్మపత్రములు
కలికికన్బొమలు నంగజు వింటి కొమలు, జలజనేత్రముఖంబు చంద్రసఖంబు
తొయ్యలిముంగురుల్ తుమ్మెదసరులు, నయ్యంగనవిలాస మలవియె పొగడఁ
దామరసేక్షణ తనుకాంతిచేత, హేమసౌందర్యంబు నెపుడు జయించుఁ
గలకంఠి యూరుప్రకాశంబుచేత, లలిత మా రంభావిలాసంబు మించుఁ
గరిరాజగామిని కనుఁగవజిగిని, హరిణవికాసంబు హరియింపఁ జూచుఁ
గలికి నెన్నుదుటి చక్కఁదనంబుచేత, నలశశిరేఖ యొయ్యారంబు మించుఁ
దరుణినాసిక తిలోత్తమనుతిఁ గాంచుఁ, గురులచేత సుకేశికొమరు వహించు
నచ్చరపూఁబోణు లందైన యుల్ల, మచ్చెకంటికిఁ గాంతిమతి కెన గలదె
సకియ ప్రత్యక్షపాంచాలశయ్యలను, సకలప్రబంధముల్ చదువంగ నేర్చు
సంపూర్ణచంద్రాస్య జంత్రగాత్రముల, నింపొంద వీణ వాయింపఁగా నేర్చు
పదపద్యగద్యముల్ బహువిధోల్లేఖ, లొదవఁగా రచనసేయువిధంబు నేర్చు
వెలఁది నాటకములు వింతవింతలుగ, వెలయించి కేళికల్ వినుపింపనేర్చు
వ్రాలు ముత్తెము లన వ్రాయంగనేర్చు, లీలఁ జిత్తరువులు లిఖయింపనేర్చు
మన్నారుదాస వేమాట లింకేల, నిన్ను మెప్పింప మా నెలఁతయే నేర్చు.

వా. అని మఱియు నే మనుచున్నది.

పదము - మధ్యమావతి - అటతాళము.

ఎన్నరానివలపు యింతికి నీమీఁద, మన్నారుదాసధీర మక్కువ నేలుకోర॥౧॥
తుమ్మెదనారిగల తుంటవిలు పూని, కమ్మవిల్తుండు చాల గాసి సేయంగను॥౨॥
వెలయంగ వెన్నెల వేఁడిమిఁజల్లుచుఁ, గలువల చెలికాఁడుకడుమచ్చరింపఁగను॥౩॥
తమ్మివిరి పుప్పొడితావి పైనింపుచుఁ, దెమ్మెర ద్రిమ్మరి దొమ్మి సేయఁగను॥౪॥

వా. అని మఱియు నే మనుచున్నది.

విలాసవతిచదివే పద్యము.

క. కులమున గుణమున రూపున, నిల నలకాంతిమతివంటి యింతులు గలరే
చెలువకు నీవే తగుదువు, తలఁపఁగ నాయింతి నీకె తగును నరేంద్రా.

వా. అనిన విని యవనివిభేత యతిచమత్కారవచనరచనావిలాసవతి యగువిలా
సవతినిం జూచి యే మనుచున్నాఁడు.

నాయకుండు చదివే ద్విపద.

చెలువ మన్నారును జెంగమలమ్మ, పులుఁగుఁదేజీ నెక్కి పొదలుచు రాఁగ
సేవింపుచును వచ్చి చెంత రాణించు, సౌవర్ణ మగునొక్కసౌధంబునందుఁ

బ్రతిలేని రతనంపుప్రతిమన మించు, నతివ నొక్కతెఁ జూచి యచ్చెరువంది
యేరాజకన్యయో యీరాజవదన, యేరాణియో యయ్యారమయ్యారె యనుచుఁ
జాల నామదిలోన సంతసం బంది, బాలికామణిపయి బాళి దలిర్పఁ
బరఁగుగోపాలుని ఫాల్గునోత్సవము, నెఱవేర్చి తగువారి నెమ్మితోఁ బనిచి
యింతినిం బెండ్లాడ నేఁగోరియుంటి, నింతలో వచ్చితి విందీవరాక్షి
యిద్దఱికోరికె లీడేఱె ననుచు, ముద్దియతోఁ దెల్పు మోదంబుమీఱ.

వా. అని యాభూభరణుం డాభరణాదుల బహూకరించి పంచినఁ జంచలాక్షి యే మనుచున్నది.

విలాసవతి చదివేపద్యము.

క. స్వామీ నీతోఁ దెల్పిన, యీమాటలు రాజచంద్రుఁ డెఱుఁగకయుండన్
నీమంత్రుల నట పంపుము, తానుసమున కింకఁ జెలియ తాళదుసుమ్మీ.

వా. ఇవ్విధంబున నవ్విలాసవతి యన్నరనాథునితో విన్నవించి మగుడి నచ్చు సమయంబునఁ గాంతలమేలుబంతి యైనకాంతిమతి మకరకేతుకిరాత దురాసదశరాసనటంకార హుంకారంబు సైరంపలేక చంచరీకఝుంకారంబు వారింపలేక కీరంబుల దాగి మీఱలేక తనడెందంబునం గందళించు కుందుఁ దీర్ప నేర్పరి గాక యీచందంబున నిందుకందర్పసుందానిలాదుల దర్పంబునఁ గదా యని తన వీఁక విడువలేక శాఁకలఁ బెట్టు రాకానిశాకరుని స్వకీయహృదంతరనిరంతరితనిశిత శరనికేతనుని మకరకేతనుని నిందించె నఁట యెటువలెను.

కాంభోజి రాగము - అటతాళము.

పదరెదవదేర వెన్నెలరాయ, పదరెద వదేర నీకు నే పగదాన నఁటరా।
బెదరించేవేమిరా విజయరాఘవేంద్రుని, ముదమునఁ దోడ్కొనియిదె చెలివచ్చీని॥
నామాటవినురా కల్వలరాయ, నామాటవినురా మోరినీకు మోమోటలేదా
రామాపాంచాలునిరఘునాథతనయుని, ప్రేమతోఁ దోడ్కొనిరామయిదె వచ్చీని॥
చెనకేవదేరా వెన్నెలరాయ చెనకేవదేరా, నీవు నాపైఁ గినుక సేయుదురా
మనసిజాకారుని మన్నారుదాసుని, వనజాక్షి తోడ్కొని వచ్చీని యింతలో॥పద॥

వా. అని మఱియు నేమనుచున్నది.

కవి. చెక్కిలి నొక్కుచుఁ జిన్నిచన్నులు చీరి పుక్కిట విడె మొసంగి బుజ్జగింపుచును
అక్కునఁ గదియించి యంగజుకేళిని నన్నుఁ గ్రక్కునఁ బైకొని రాకాఁక దీఱఁగను॥౧॥
ముచ్చట మీఱంగ మోవి యానుచును, దచ్చనవగ బాలఁ దమి హెచ్చనిపుడు
అచ్యుతవిజయరాఘవ యాదరింపుచుఁ, బచ్చవిల్తుని కేళి బాస నన్నేలరా॥౨॥

వా. అని పలికి కాంతిమతి చెంతనున్న యింతులతో నేమని యాలోచన చేయుచున్నది.

ద. పంతముల్ పల్కెఁ గాఁ బలుమాఱు మనతోడఁ గాంతుని దెచ్చునా కాంత యీ వేళ
దొరకునో దొరకదో తొయ్యలికి సుఖంబు దొరకిన మనసిచ్చి దొరమాటలాడునా
మచ్చరంబున నద్దిగుగన లీమాటలు అచ్యుతవిజయరాఘవు నాలకింపనిత్తురా॥

వా. అనిన విని వనజముఖితో సఖీమణు లేమనుచున్నారు.

ద. తలిరుఁబోణి యింత తాలసించినపుడె, చెలువ నీ తలఁపెల్లఁ జేకూడె నమ్ము॥౧॥
మంచియుపశ్రుతి మాకు నరో వినవయ్యె నెంచిన కార్యంబు నిదిగో ఫలియించు॥౨॥

వా. ఆ సమయంబున మన్నారుదాస భూపాలుని రూపరేఖావిశేషంబులు గనుంగొని యనన్యజనన్యజన్యాసన్యధీనస్వాంతయై కాంతిమతీకాంతకు సమాగమసంతోషంబు సూచింప ధీచమత్కృతిం గనుపట్టఁ జట్టుఁగైదువ బోదు పట్టంపు రాణియైన శోణాంభోరుహాకీరవాణి ముద్దుమీఱ నెఱుకతయై వచ్చె నంత యిట్లనెను.

ద. చెలువ మన్నారుదాసుపై వలపు నిలుపలేక, కలవరింపుచున్న కాంతిమతికిఁ।
దలఁచిన తలఁపెల్లఁ దార్కాణగాఁ దెల్ప, నల చెంగమ్మ యెఱుక చెలువయై వచ్చె॥

ద. వచ్చె నెఱుకత హెచ్చు సొమ్ముల వన్నె మిన్నగ మెఱయఁగ,
మెచ్చుగా నల కాంతిమతికిని మేలుగా గుఱి దెల్పుచు ॥౧॥

వా. ఇవ్విధంబున వచ్చిన చెంచుమించుఁబోణినిం జూచి నెచ్చెలి సంతసంబునఁ గాంతిమతికి నేమనుచున్నది.

చెలికత్తె చదివే ద్విపద.

విను కాంతిమతి యెఱుకపింత యీ వేళ, మినుకు బంగరుచాయ మెఱయు నెమ్మేను
సుప్పాణిముత్యాల సొబగుకమ్మలును, గప్పురా జిగిమించు కస్తురిబొట్టుఁ
బలుచని చెక్కులు బటువు పాలిండ్లుఁ, జెలువైన కెంగేలఁ జెలఁగు బెత్తంబు
జాఱుకొప్పున నొప్పు సంపంగిసరులు, నారమా వజ్రాలసందిదండలును
బటువుముత్తియముల బన్నసరాలుఁ, గటిని ఘటించిన కనకాంబరంబు
విరులచెండును నెమ్మిపింఛంబు మెఱయ, నురమున బురుకనిహారాయలు గాఁబూని
తలఁపులో నర్థంబు తార్కాణగాఁ గఁ, దెలుపు మటంచుఁ బ్రార్థింపఁగా జనులు
ఎఱుకత యొక్కతె యిదె రాజవీధి, నొఱపుగా వచ్చుచు నున్నదో యమ్మ.

వా. అని విన్నవించిన వన్నెలాఁడినిం జూచి కాంతిమతి యేమనుచున్నది.

కాంతిమతిమాట— ఓవాలుగంటి యీచెంచుమించుఁబోణి నాపాలవెలయు గోపాలునిపట్టంపురాణియే తప్పదు. ఇప్పుడు గ్రక్కునఁ దోడి తేవే.

వా. అని పలికినఁ గలికిపలుకులు విని యౌవనజగంధి యెఱుకతసరసకు మరలి మరలి వచ్చి యేమనుచున్నది.

చెలికత్తెమాట—రావే యెఱుకలమచ్చెకంటి మానెచ్చెలి పిలిచీని.

వా. అనిన విని యామెచ్చులాఁడి యచ్చటికి వచ్చి నఁట యెటువలెను.

వా. ఈకరణి వచ్చిన శాకునికకోకిలాలాపను జూచి కాంతిమతి సంతసంబున నే మనుచున్నది.

ద. సంపంగితోఁటలో సొంపొందు దేవతవో, యింపొందు నీపట్న మేలు దేవతవో।
క్రొమ్మ నినుఁజూడఁ జెంగమ్మ తలంపయ్యె, నమ్మ నీ వెవరమ్మ యానతీవమ్మ।
కెంగేల నీవిపుడు గీలించు బెత్తంబు, చెంగోలువలెఁ దోఁచె బంగారుతల్లి॥

వా. అనిన విని యేనాదిమానవతి చెలువుగాఁ దా వెలయు నెలవు లే మని తెలుపుచున్నది.

ద. రాకాసిరాయలఁ జీకాకుచేసిన, రాకొమరునియింట రాణించియుంటి ॥౧॥
దుండి యాబండిపొలదిండిఁ జెండాడిన, దుండగీనివీట మెండుగానుంటి ॥౨॥
యెలమిదక్కినదొరకిరవుమాకిపుడు, వెలయుమన్నరుదానువీటనిపుడున్నాను॥

వా. అనిన విని యన్నారీమణి మన్నారుదాసనామధేయవర్ణనాకర్ణనంబున నంతరంగంబున సంతసంబంది భ్రూతారాదృగ్వికారాదులై చెలంగు నాంగికానుభావంబులును శృంగారసూచకంబులైన వాచికానుభావంబులును దనరఁ దనచెంతనున్న యింతులం జూచి చిఱునవ్వు నవ్వి యగ్గలం బైనసిగ్గునఁ గించిదవనతవదనయైన చంచలాక్షిని జూచి యాచెంచుమించుఁబోణి యే మనుచున్నది.

ఎఱుకతమాట—యెరుఖాడు గెరుఖాడు గెరుఖాడుగే దుండి, నీవు తలంశిన తలంపు నీవు తలంశినతలంపు నిజముగా శెప్పేనే నిజముగా శెప్పేనే, నిక్కముగా శెప్పేనే, తార్కాణగా శెప్పేనే, తార్కాణగా శెప్పేనే, దుండి, అమ్మాయమ్మ అమ్మాయమ్మ యీబురుకనికి యీబురుకనికి బువ్వ దేవే బువ్వ దేవే, అవ్వగురిసూడ మొరంటెలో ముత్యాలు దేవే ముత్యాలు దేవే, దుండీ.

వా. అనియెఱుకల మెఱుంగుఁబోణి తనశిష్టాభీష్టదేవత నే మనికొనియాడుచున్నది.

ఎఱుకతమాట—శ్రీరాజగోపాల, దొరకానాథ, బంగారుమన్న, శెంగమరేండా, శెండలంకార, వండువరావది, నల్లనిదేసర, గొల్లలసామి, చంపకవనవాస,

సంపంగిరాయ, విజయరాఘునవరద, విజయసహాయ, నీవేనేనయి, నాతలం పున నిలిశి, యీాకలికి తలంశినతలంవు, నిజముగా, బలుకవయ్య, నిక్కముగా బలుకవయ్య, తార్కాణగా బలుకవయ్య.

వా.అని యెఱుకలబుట్ట చేపట్టి రాజచంద్రునిపట్టి చేపట్టి యేమనుచున్నది.

అమ్మాయమ్మ, అమ్మాయమ్మ శెయిసూపు శెయిసూపు శెయిసూపవే దుండి, దనముగల శెయ్యే, దాన్యము గలశెయ్యే, బంగారు శెయ్యే, భాగ్గ ముల శెయ్యే దుండి, అటునిటు సూడక నేశెప్పేగురివూంకొని వినవే వూంకొని వినవే దుండి, కండ్లంటే తోడు, కడుపంటే కొడుకు, కంటెంటే మగండు వొండే రెండే వొంను.

వా అని మఱియు నేమనుచున్నది.

ద. మదిరాక్షి హెచ్చుతలంపుమదిసిదలంచితివి,అదినీకుఁదెలిపెదనతిచయేమిచ్చేవే॥
అలరువిల్తుండు మించుచెలువుండునీకుఁజేరఁగలగంటివిరేయి కలకంఠియీావు॥

యెఱుకతమాట—అమ్మాయమ్మ, అతం దేవితమువాం డంటా అడిగేవే, అతం దేవితమువాం డంటా అడిగేవే, అయితే తెలిపే వినవే దుండీ.

ద.జనియించితంద్రికిజయ మొసంగినవాఁడు, అనిపంపులనుబగరననంచినవాఁడు॥
మదవతి యెదయందు మచ్చగల్గినవాఁడు, పదియారుదానలఁ బరగినవాఁడు॥
కనకగర్భంబునఁ గనకాబ్జదేవికిఁ దనయుండై చనుబాలు ద్రావినవాఁడు॥3॥
ప్రతిదినం బొకకోటిబాపల కన్నంబు, యితవుగాఁ బెట్టించియిల యేలువాఁడు।
వేయాఱు వెలఁదుల వెలయించుదక్షిణ,నాయకుండనిమించినలువొందువాఁడు।
అతఁడె నీపతి యగు నందుకుఁ దార్కాణ,యితవైన నెచ్చెలి యిదిగో వచ్చీనే।

వా.అని పలికి యాకలికి చిలుకలకొలికిచేత సకలబహుమతులుఁ జెంది యాయరు ణారవిందేందిర నిజమందిరంబు సేరుసమయంబున యువతిచెంగటికి లసమాన సోల్లాసవతి యగు విలాసవతి వచ్చి యేమనుచున్నది.

కళ్యాణి రాగము - ఆదితాళము.

ఫలియించె నీకోర్కె భామరో నేఁడు,చెలువమన్నరుదాసుండు చెలియఁ బెండ్లా [డునే.

వా.అని మఱియు నేమనుచున్నది.

కళ్యాణి రాగము - ఆదితాళము.

వీనులవిం దాయె విజయరాఘవుని మాటలు,
మానవతిరో వినుము మనను చల్లనయ్యాని॥

చక్కఁదనంబునకు సాటి యెవ్వరు లేరు, ప్రక్కకు వచ్చెను పణఁతి వగవనే లె
చెక్కిలి నొక్కి నేను జేరి చనవునఁ గూడి, అక్కఱతో నిన్నాదరించేవ ననెనే
కమ్మని మోవాని కౌఁగిట బిగియించి, కొమ్మవిరుల దువ్వి కొప్పు సవరించి।
ముమ్మడించిన ప్రేమతో ముద్దుఁబెట్టి, యెమ్మెకాఁడు నిన్నెంతైనలాలించేవ ననే.
వా. అనిన విని కాంతిమతి యాయింతి నేమని యుపచరించుచున్నది.

కాంతిమతిచదివే ద్విపద.

నీవను తేప యోసెలఁత గల్గఁగను, నీవిరహాంబుధి నేనీఁదఁగంటి
వనిత నీవనెడు సర్వాంజనం బొదవఁ, దనప్రియుం డనెడు నిధానంబుఁ గంటి
లలన నీ వనుకల్పలతిక గల్గఁగను, దలఁప నాదుమనోరథఫలంబు దొరకె
కలికి నీవనియెడి కంలశాబ్దిలహరి, గలుగ వాగమృతంబు గలిగె నావాల
ఉచితోపకృతికిఁ బ్రత్యుపకృతి యెట్లు, రచియింప నేర్తునే రాజీవనయన
తనవద్దనుండెడు తరుణులలోన, ననరైన నీవంటి నెచ్చెలి గలదె
ఇంకొకపారి నీ పీపల్కులెల్లఁ, గొంకక తెల్పవే కొమ్మ నాతోను
మన్నారుదాసుండు మన సిచ్చి నీవు, విన్నపించిన దెల్ల వినియెనా నేఁడు.
వా. అని నెచ్చెలితోడ ముచ్చట లాడుచు నచ్యుత విజయరాఘవసార్వభౌముని
యాప్తజనాగమనంబుఁ బ్రతీక్షింపుచు వారిజాక్షి యున్నయనంతరకథాసం
విధానం బెటువలెను.

కవివచనము పద్యము.

చ. ఎనయఁగ నవ్విలాసవతి యింపుగఁ బల్కినయట్టి పల్కుల
న్మనసున మాటిమాటికిని మానిని చెల్వమి ప్రేమనెంచుచుం
గనకవిభాంగి కాంతిమతి కన్నులఁ గట్టిన యట్టు లుండఁగా
మనసిజబాణవర్షములు మన్నరు దాసుఁడు నోర్వ కిట్లనున్.

భైరవి రాగము - ఆదితాళము.

చాలా దయవాఁడనె సరగున నన్నేలుకోవే,
యేలనే యీమోడి యెలనాఁగ నీకిపుడు ॥ ౧ ॥
చక్కెరమోవి యొసంగి చవులఁ దేలించితే,
చొక్కమౌ మురువు ముత్యములు సుదతి యిచ్చేనే ॥ ౨ ॥
గారవఁబున నన్నుఁ గౌఁగిటఁ జేర్చితే, నీరాజిదుప్పటి నెలఁత యిచ్చేనే॥౩॥
వచ్చవిల్తునికేళి బాగుగఁ గూడితే, పచ్చలపదకంబు భామ యిచ్చేనే ॥ ౪ ॥
వా. అని మఱియు నేమనుచున్నాఁడు.

ముఖారి - అటతాళము.

వన్నెలాఁడి నీమీఁదివలపు నిలుపలేనే, యెన్నరాని దయనేలవే మగువరో।
బొమ్మరమ్ముల నమ్ముఁజిమ్ము చన్నులముద్దు, గుమ్మనాఱొమ్ము గుమ్మవే మగువరో॥
అలరువిల్తుని కేళి వెలయింపవే నన్ను, కలికి విజయరాఘవుండనే॥

వా. అని మఱియు నేమనుచున్నాఁడు.

పదము - సావేరి రాగము - దరువు

గద్దఱి చిలుకలు గద్దింపుచు నదరీని వద్దని పలుకవె ముద్దుగుమ్మ। యీప్రొద్దు నిద్దుర కంటికిరాదే॥

తుంటవింటి యొంటరి నావెంట నంటేని। కెమ్మోవిపంటి మొనకు నంటు సేయవే యోవాలుఁగంటి నీజంటఁబాసి యొంటినుండనే॥

ప్రతిలేనిచిలుకపలుకులు పలుకవె నాతోను, రతిరాజసముండనైనట్టి రఘునాథతనయుండనే॥

కంజాక్షి చూడవె కరుణించి నెనరుతోఁ, దంజపురమేలేటి దానశూరుండనే॥

బంగారు గిన్నెలనంటి బటువైన పాలిండ్లు పొంగుచుఁ బాలింపవే పొలఁతి విజయరాఘవుఁడనే॥

హారువుగ నన్నేలు మలుకలేల నేసేవు మరునికేళి ననుంగూడవే మగువ నీదాసుండనే॥

వా. అని మఱియు నేమనుచున్నాఁడు.

కవి. చానరో నీదుచక్కఁదనం బెల్ల వీనులవిందుగా వినుచుఁ జొక్కితినే।
తేనెలుగులుకునీ తేటైనకెమ్మోవి, పానకము దయసేయవే బాగు మీఱంగను.

వా. అని మఱియు నేమనుచున్నాఁడు. నాయందు చదివే పద్యం.

సీ. పలుమాఱు పిలిచినా పలుకక యున్నావు పంతమీవేళనా పద్మగంధి
యెంత నేవేఁడినా యెలమితోఁ జూడవు సరస మీవేళనా సన్నుతాంగి
చేరి నే మ్రొక్కినా చేరఁదీయ వదేమి నవ్వు లీవేళనా పువ్వుఁబోఁడి
కదియ నేవచ్చినా కౌఁగిలింప విదేమి యలుక లీవేళనా జలదవేణి
తగుణి నీదాసుఁడనుచును దయను నన్ను, సేవసేయించుకోరాదె చెలియనీవు
మరుఁడు దండెత్తె నామీఁద మగువ నీదు, చరణపద్మంబులకు నిదే శరణుశరణు.

వా. అని మనుజవల్లభుం డుల్లంబునఁ గలంక మల్లడిగొన వల్లకాంతభల్ల నిశితశర పరంపరల సైరింపలేక విరహం బాఁపలేక మెఱుంగుసూరెపుటంపు టోరఁ గుప్పెఁ జేరి దురవగాహమోహపారవశ్యంబున నుండుసమయంబున నాయంబుజాక్షులు తమలోఁ దాము సైఁగల సన్నలఁ జేయుచున్నారు.

సావేరి రాగము - అట - దరువు.

ఎలనాఁగచూచి తెయీావిభు మోహంబు, వెలఁదిచూచితి నెంతవింతా యెనమ్మ॥
నలినాక్షి వింటివా నాథునిపలుకులు, అలివేణి వింటినమ్మా అందంబుగానె॥౨॥
అందచందంబుల నాటపాటలచేత, సింధుముఖి మనకన్న హెచ్చటనమ్మ ॥ 3 ॥
ఇంతులపొందుదా నెఱుఁగనిచందాన, నెంతయుఁజిత్తమా కాంతపై నుంచె॥ ౪ ॥
వలచేవారు లేరో వనితలపైని, వెలఁదియిటువంటితమివింటిమా యెందైన ॥ ౫ ॥

వా. ఆసమయంబున మన్నారుదాసధరాపురందరుని చెంగటికిఁ జక్రధరచర్యు లగు శతక్రతుశ్రీనివాసతాతయాచార్యవర్యులు విజయించి రంట యెటువలెను.

ద. మురువైనచొకట్లు ముత్యాలకుళ్లాయి, సరిలేనిరతనాలజంటయుఱచట్ట ।
హారువొందు వాజపేయచ్ఛత్రములనీడఁ, దిరుమల శ్రీనివాసదేశికులు వచ్చిరి.

వా. ఈచందంబున వచ్చిన యాచార్యులు తమకు వందనం బాచరించిన యాచం దనగంధులం జూచి యేమని యానతిచ్చేరు.

ఆచార్యులు చదివే పద్యం.

సీ. ఎప్పుడు వచ్చినా యెదురుగాఁగ నె వచ్చి పాదముల్ సేవించి భక్తిమీఱఁ
గైదండ యొసఁగుచు గద్దియపై నుంచి మమ్ముఁ బూజించును నెమ్మిమీఱఁ
నేము దగ్గఱ రాఁగ నెంతయుఁ బ్రేమచే నెదురుగా రానట్టి హృదయమేమి
చెంతఁ గూర్చుండిన సంతోష మమరంగఁ బలుకకయున్నట్టి భావమేమి
మన్ననారుకటాక్షంపు మహిమవలన, మనకసాధ్యంబు లెవ్వియుమహినిగలవె
మనసులోపల నున్నట్టిమతి మదేమి, తెలియఁగాఁ బల్కరమ్మ యో చెలువలార

వా. అని యానతిచ్చిన శ్రీనివాస తాతయాచార్యులతో నామేచకకచ లేమను చున్నారు.

ముఖారి - ఆది - దరువు.

ఏ కాంతయో కాని యే కాంత మొకటి, యీాకాంతునకుఁ దెల్పెనిందఱుఁజూడ.

వా. అనిన విని దరహాసవదనుండై గురురాయపట్టభద్రుండు వితతినయుండగు తనతినయుని మీను మస్తరింపుచుఁ గుస్తరించిన నాయస్తోకప్రభావుం డగు విజయరాఘవసార్వభౌముండు శుభకరం బైనగురుకరవిమర్శనంబునఁ గలంక దీరి తెలివిఁ జెంది మందమందముగ డెందంబున నానందంబు గందళింప నాతిరుమలవంశనందనునికి నందనం బాచరించి యేమియు మందలించ లేక యున్నచందంబుఁ జూచి ధీచాతురి మెఱయ నాచార్యులేమనుచున్నారు.

వా. ఆచార్యులు చదివే ద్విపద.

మన్నారుదాస నీమనము నేఁ గంటి, విన్నఁదనం బింక విడువుము నీవు
కలికిపై వలచిన కారణం బేమి, తెలిపెద విను తేటతెల్లమిగాను
ద్వాపరయుగమున వచ్చిచంద్రుండు, గోపాలుచెంతకుఁ గుతుకంబు మీఱ
రవిశశినేత్ర శ్రీరమణీకళత్ర, వివరింతు వినుము నావిన్నపం బొకటి
తరణికుమారియై తగు కళిందజను, బరిణయంబైన యప్పగిదిని నాదు
చిన్నికొమార్తను చేకొని రెండు, కన్నులు సరిగాన కనుఁగొనవయ్య
అన విని గోపాలుఁ డాచంద్రుఁ జూచి, నెనరున నిట్లనె నీదుచెల్లెలిని
వేడుకతో మేము పెండ్లాడ మేన, గోడలయ్యెను నీదుకూఁతురు మాకుఁ
గలియుగంబున యశోగరిమచే ధరణిఁ, బొలుపొంద రఘునాథభూనాథమణికి
విజయరాఘవుఁడన విఖ్యాతిగాంచి, ప్రజలెల్లఁగొనియాడఁ బ్రభవింతునపుడు
తనరెడు దక్షిణద్వారకాస్థలిని, జనియింపుదువు రాజచంద్రుండ వనఁగ
నపుడు నీకన్నియ నమరఁ బెండ్లాడి, యపరిమితశ్రీల నలరింతు ననియెఁ
గావున విజయరాఘవ వన్నె నీవె, భావింపగాను గోపాలదేవుఁడవు
చంద్రుండె యారాజచంద్రుండుగాన,సాంద్రమోదమున నాజననాథసుతను
అతివలమేల్బంగి యనఁదగు కాంతి, మతిఁ బెండ్లి సేసెద మనుజేంద్రనీకు
సరగున నారాజచంద్రునకేము, నిరుపమంబుగఁ దెల్పి నీగుణావళులు
తనయపెండ్లికి ముహూర్తమునిశ్చయించి, మనసురంజిలనిదె మరలివచ్చెదము.

వా.అని పలికి యయ్యాచార్యవర్యుండు విజయరాఘవమహీకాంతుని యంతరంగంబునకు సంతసం బొనరించి బంగారు టనముల రంగారు వింతవగపనుల దంతపు పల్లకి యెక్కి చెంతలను శ్రీవైష్ణవశ్రేణులుగొలువ నగ్గలం బగుహెగ్గాళెలు దిగ్గగనంబులు నిండ ముందుగా మ్రోయ సువర్ణదండరంజితంబు లగు వింజామరంబులు వీవ నిస్తంద్రచంద్రమండలరాజమానంబు లగువాజపేయచ్ఛత్ర శతంబులు వరుసగా నిరుగడల ధరింప సురభిఘృతధారాపూరితంబులైన దీపికానికరంబులు పరిచారకప్రకరంబులు కరంబులం బూని క్రందుకొని సందడిగ నడవ మాపాలవెలయు గోపాలుం డీమహామహుండే యని యాబాలగోపాలంబును వందదంద వందనంబులు సేయ నానందింపుచు సకలవైభవసాంద్రుం డగు రాజచంద్రునిహజాగంబునకు వచ్చునవసరంబున రాజచంద్రుండు నెదురుకొనవచ్చెనఁట యెటువలెను.

సారంగ రాగము-అటతాళము.

రాజాధిరాజులు రమణతోఁ గొల్వంగ, రాజచంద్రుఁడు వచ్చె రాజసర

వా. ఈరీతి నెదురుకొన్న యారాజచంద్రుండు వ్యాప్తాంతరంగుండై సాష్టాంగ దండప్రణామంబు గావించి యర్ఘ్యపాద్యాదుల బహూకరించి యంతఃపు రంబుఁ బ్రవేశింపఁ జేయించె నంట యెటువలెను - - - - - -

వా. తదనంతరంబు ముదం బంకురింపఁ జెలువుమీఱఁ గులకాంతలుఁ దాను బహువిధోపచారంబు లాచరించి కాంతిమతిచేత మ్రొక్కించిన నక్కన్యా రత్నంబును గాంచి యాచార్యు లేమనుచున్నారు.

ఆచార్యులు చదివెడి పద్యము.

క. విజయమునఁ గరుణచేతను, విజయుని రాఘవునిఁ బోలు వీరవరు న్నీ రజముఖి వివాహమయ్యెడు, సుజనులు గొనియాడునట్టి శుభములుగలుగున్

వా. అని దీవించిన యాదేవతావైభవుం డగునాచార్యవర్యునిఁ జూచి రాజచం ద్రుం డేమనుచున్నాఁడు.

రాజచంద్రుఁడు చదివేపద్యము.

క. దేవర యిటు విజయించిన, భావం బిది యేమి తెలియఁ బలుకఁగవలయున్ సేవకుఁడఁ గాన నిప్పుడె, కావించెదఁ గోరినట్టి కార్యము లెల్లన్.

వా. అనిపలికిన రాజచంద్రునితో నాచార్యు లే మనుచున్నారు.

ద - శంకరాభరణము-ఆదితాళము.

వినుము రాజచంద్ర మావిజయరాఘవుండునీ, తనయను బెండ్లాడఁ దలఁ చినాఁ డిపుడు ॥ ౧ ॥

ఈపెండ్లి చేకూర్ప నేము వచ్చితిమి, రేపు ముహూర్తమ్ము నీపుత్రినిమ్ము ॥ ౨ ॥

వా. అని పలికి యామన్నారుదాసుగుణము లే మని వర్ణింపుచున్నారు.

ఆచార్యులు చదివే ద్విపద. [డు

వినురాజయతఁడుమాప్రియశిష్యుఁడగుచుఁ, దనరును మన్నారుదాసాహ్వయుం

డిన చెవ్వయాహ్వయక్షితిగోప్తసప్త, ఘనుఁడచ్యుతక్ష్మాకాంతు పౌత్రుండు

రఘునాథమేదినీరమణుపుత్రుండు, మఘవసమానుండు మహితవైభవుఁడు

సాహిత్యభోజుండు సంగీతవేది, బాహువిక్రమశాలి భాసురశైలి

చాతుర్యధుర్యుండు సర్వార్థదర్శి, జాతివార్తలమేటి సద్గుణపేటి

స్వాశ్రితజనత్రాత సంపద్విధాత, విపులకీర్తివిహారి విమతవిదారి

తనరుషోడశమహాదానదీక్షితుఁడు, అనిశంబు లక్షవిప్రాన్నప్రదాత

మనసిజాకారుండు మానధనుండు, వినయాన్వితుఁడు కవిజనపోషకుండు

నీతికి మనురాజు నేర్పరి మిగుల, చాతలరాయుండు దాక్షిణ్యశాలి

[illegible] దరవ[illegible]. నాటకపరితోషి [illegible]

చూడఁ గల్గినవాఁడు చుట్టాలసురభి, యాడితప్పనివాఁడు నాశ్రితావనుఁడు
రసికుండు నెఱజాణ ప్రాబంధికుండు, నానపరియాత్నాహి యుచితజ్ఞుఁ డరయ
రామాయణాదిపురాణపారీణుఁ, డామోదసంధాయి యఖిలార్తిశాయి
శ్రీరాజగోపాలసేవాపరుండు, వీరాధివీరుండు విజయరాఘవుఁడు
అతని గుణంబుల నభినుతింపఁగను, జతురాస్యునకు నైన శక్యమే జగతి
అటువంటి మేటి నీయల్లుఁ డైనపుడె, యిటువంటి భాగ్యంబు నెవరికిఁగలదు.
వా. అని మఱియు నే మనుచున్నారు.

ద - మధ్యమావతి - జంపెతాళము.

ఈపూర్వవృత్తాంత మీవు దెలియుదువె, యోపార్థివచంద్ర యుచిత మీతలంపు ॥ ౧ ॥

కులమును శీలంబు గుణము రూపముఁ జూడ, కళావతిసుతునకు నీ కన్నియ కమరు ॥ ౨ ॥

ఏమాన తిచ్చినది యితవుగా మదినెంచి, ప్రేమ నీకూఁతురికిఁ బెం డ్లానగూర్పు ॥ 3 ॥
వా. అనిన విని రాజచంద్రుఁ డే మనుచున్నాఁడు.

దరువు - ఘంటారవము - ఆదితాళము.

సదివేలసతులతోఁ బరఁగినవాని, హృదయము నాతనయపైని నన యంగాఁ జేర్చునా.

ముఖారిరాగము - అటతాళము.

ఎలమి సవతులలోన నీచిన్నపడుచు, చెలువునిమననురా సేవచేయనేర్చునా.

కేదారరాగము - అటతాళము.

కలనైనమీమాట కాదన వశమె, తెలుపందగినవిధము తెలిపితిఁగాని.
వా. అనిన విని శ్రీనివాసతాతయాచార్యు లేమనుచున్నారు.

ఆచార్యులు చదివే పద్యము.

సీ. విజయరాఘవమహీవిభునిగుణంబులు వినుతింప నలవియే విభవతంప,
కామినులెందఱు గలిగిన సంతతి సమముగా నేలెడు స్వామి యతఁడు
పసిబిడ్డ యైనను భావంబు రంజిల్ల దిద్దుకోనేర్చిన ధీరుఁ డతఁడు
చనవిచ్చి వడపెనా శాశ్వతంబుగ నిల్పు నితరరాజులసాటి యెంచనేల
ప్రేమతో మత నేఁబూని పెండ్లిసేయ, సవతులందఱు నీపుత్రిసాటిరావ్వ
రింక నాలోచనలుమాని యిపుడుసుతను, విజయరాఘవునకునిమ్ము వేడ్క మీఱ.
వా. అనిన విని రఘునేతగుణసాంద్రుం డగు రాజచంద్రుం డాచార్యవర్యునితో

రాజచంద్రుండు చదివేద్విపద.

ఓనయ్య మీరిటు లానతీయంగ, నే నుత్తరం బీయ నెంతటివాఁడ
స్వామివారు తనకు సకలభాగ్యములు, వేమారు చేకూర్చు వేల్పుఁగాన
నాముద్దుపట్టిని నరపతు లెంచఁ, శ్రేయ మన్నరుదాసవిభునకు నిత్తుఁ
బొంతనంబులు చూచి పుత్రికామణికిఁ, గాంతిమతికిని లగ్నము నిశ్చయించి
పెరిమమీరఁగమీరె పెండ్లిపెద్దలయి,యిరవొందఁ బెండ్లిసేయింపఁగావలయు

వా.అని పల్కిన రాజచంద్రునితో నాచార్యశిఖామణి యేమనుచున్నాఁడు.

ఆచార్యులు చదివే పద్యము.

గీ. మన్ననారు రథోత్సవమహిమ జేసి, వేడ్కఁగావించి యెంతయు విభవమలర
వినుము నిశ్చయతాంబూల మొనరఁ జేయ, నీదునగరికి వత్తుము నిక్కముగను.

వా.అని యానతిచ్చిన యాచార్యచంద్రునకు రాజచంద్రుం డమూల్యంబు లగు
కనకాంబరమాల్యంబులు నవర్ఘ్యంబులగు మణిభూషణంబులు సారఘన
సారతాంబూలంబులు సమర్పించినఁ గైకొని యమ్మహామహుండు నిండువే
డుకతోడ సుముఖుండై సముఖంబునకు మరలి వచ్చి వన్నెమీఱ మన్నారు
దాసునితో నేమనుచున్నారు.

కేదారగౌళ - ఆదితాళము - ద.

ఫలియించె నీకోర్కి చెలువమన్ననికృప। నెలమిపురోహితుల నిటకు రప్పింపు.

వా.అనిన విని మనుజేశ్వరుండు శ్రీరాజగోపాలరథోత్సనంబు శేఖరించి యనంత
రంబు హితులైనపురోహితులరప్పింప నచ్చటికి వారువచ్చిరఁట యెటువలెను.

ద - రేవగుప్తి - ఆదితాళము.

పట్టుతుల్లాయలుపెట్టి పంచాంగములు చేతఁ। బట్టి పురోహితులు వచ్చిరావేళ.

వా. ఇవ్విధంబున వచ్చిన పురోహితులం జూచి యాచార్యు లేమనుచున్నారు.

ఆచార్యులమాట—రారయాపురోహితులార! మీరు యీనగిరికి నూరుతరాల
నుంచి తగువైనవారుగనుక ముహూర్తం గలవారు, అటుగనుక కనకాంబర
ముస్నా ముడుంగరాలతోట్టుకూడా నగరిమువైదువులచేత పండు పసపు బం
గారు టెంకాయలు పూలు వక్కలాకులు మొదలైనశోభనద్రవ్యాలు బట్టిం
చుకొని మేళతాళాలతో గూడా ఆరాజచంద్ర మహారాజగారినగరికి పోయి
వధూవరుల పేరింట సంతోషముగా పొంతనంబులు జూచి రేవుచంద్రతారా
బలాలు గలిగిన శుభదినంబు గనక రాత్రి యిరవై అయిదవఘడియను సింహ
లగ్నమందు వివాహముహూర్త మని తెలియంబలికి నిశ్చయతాంబూలం

వా. అనిన విని పురోహితులు కల్యాణఘటనప్రవీణులై సకలశోభనవైభవ ప్రచారంబు లాచరించి మగుడి వచ్చి యాచార్యపట్టభద్రునితో విన్నవింప నాచార్యు లేమని యానతిచ్చేరు.

ఆచార్యులమాట.—రారయా పురోహితులార మీరాక శుభాకరం బయ్యెగనక సంతోషమాయను. ముందర నాంద్యావాహనాది శుభాచారంబు లాచరింపరయా.

వా. అనిన విని హితులైన పురోహితులు ధీచాతుర్యంబు మెఱయ నాచార్యానుమతులై డెందంబున నానందంబు గందళింప నాందీదేవతావాహనంబు గావించి హృద్యతరవాద్యఘోషంబులు మేదురంబుగా నామేదినీవిభుని సాదరంబుగా వాటం బైన పెండ్లిపీటయందుంచి ఫలతాంబూలంబుల వడిగ నొడినింప నత్తఱి ముత్తైదువలు వచ్చిరంట యెటువలెను.

ద. అచ్యుత విజయరాఘవాధిపు పెండ్లికి, ముచ్చటలాడుచుముత్తైదువలువచ్చిరి.

వా. ఈసరణి వచ్చినసువాసినులు సేసలువెట్టికొట్నంబులువెట్టిరంటయెటువలెను.

ద. సువ్విమన్నారుదాససువ్విరమ్యహర్మ్యవాస, సువ్విరుచిరముఖవిలాససువ్విసువ్వి సువ్విచోళభూమిపాలసువ్విసుజనవినుతశీల, సువ్వియువతిపాంచాలసువ్విసువ్వి సువ్వి మన్మథాకార సువ్విసుకవిమందార, సువ్వి సార సుగుణహార సువ్వి సువ్వి.

వా. అంతట నంతఃపురకాంతలు మెచ్చుగా నచ్యుతవిజయరాఘవధరాపురందరునకు రంగుమీఱ మంగళస్నానంబు సేయింప నామహామహుండు వివాహసమయసముచితశృంగారంబు నుప్పొంగుచుం బూనె నంట యెటువలెను.

కవివచనము ద్విపద.

మన్నారుదాసుండు మగువ లందిచ్చు, సన్నజాజి విరుల సరములు చుట్టి
సరులైన రతనాల జంటచే మెఱయు, బురుసారుమాల్గట్టి పొంకంబు మీఱ
నొప్పైన సిగమీఁద హొయలు గన్పట్ట, గొప్పముత్తియములకుచ్చు గీలించె
మంజాడులను మించు మగఱాలచేత, రంజిల్లునట్టి తురాయి ధరించెఁ
జెలువైన చెక్కులఁజిగి దులకింపఁ, బొలుపొంద ముత్యాలచురువులు పూనె
నతులితలీలఁ గట్టాణిముత్తెములు, జతలు గూర్చిన పెద్దచౌకట్లు పెట్టి
గరిమఁ గెంపులదామకంబులకంట, సరములు గళమున సవరించె జెక్కు
బుసుసాహిజారుపైఁ బొలుచుముత్యాల; నెఱజంట యుఱచట్ట నీటుగాఁ దొడిగి
తులకించు సీరాజి దుప్పటి గట్టి, వలనొప్పు గజ్జాలవంకియుఁ దాల్చెఁ
గరమొప్పు నక్షత్రకంఠమాలికయు, సరిలేని జాతిపచ్చల చిల్కతాళి

బంచరత్నమ్ముల బాహుపురులును, మించుమహానికముల మొఱయుతాయెతులు తావులపచ్చలఁ దగుకడియములు, జీవరత్నంబుల చేసరంబులును [ములు వెలయువజ్రాల హంవీరతాయతులు, పొలుపొందఁ జాలుకు కెంపులయుంగర నెలకొను బిరుదు పెండెము మొదల్గాఁగఁ,గలుగుసొమ్ములు మేనఁ గైసేసెనపుడు.

వా. ఇవ్విధంబున సింగారించుక దేశికాగ్రణి యాశీర్వదించి యొసంగు బాసి కంబు వాసిగా ధరించి దిగంతరనిరంతరిత భేరీమృదంగపటహ పణవమురవఢ క్కాహుడుక్కాదివాద్యవిశేష ఘోషంబులు పుండరీకభవాండ భాండం బులునిండ నిశ్శ్రేణికాశ్రేణికల దేదీప్యమానంబు లగు దీపికావితానంబులును సాంద్రతరజ్యోతు లగుచంద్రజ్యోతులు బాణవిద్యలు రాణింప నొప్పుగల పూలచప్పరంబుక్రింద విజయరాఘవపట్టభద్రుండు భద్రగజంబు నెక్కి వచ్చెనఁట యెటువలెను.

ముఖారిరాగము - ఆదితాళము - దరువు.

గజరాజంబు నెక్కి ఘనవైభవంబుమీఱ,విజయరాఘవేంద్రుండువీథిలోవచ్చె.

వా. ఈరీతి ధారుణీపరిణీ యూరేఁగి వచ్చు సమయంబున రాజద్గుణసాంద్రుం డగురాజచంద్రుండు తనయనుంగుతనయ యైన కాంతిమతికిఁ బెండ్లికూఁ తురు సింగారంబు చేయించెనఁట యెటువలెను.

మంజరి. అంగనలా వేళ నలకాంతిమతికి, మంగళస్నానంబు మమతఁ జేయించి ఉవిదకుఁ బావట పహాయలుగాఁదీర్చి, కోమలికిని బెండ్లికొ ప్పమరించి బంగారుపూవులపావడమీఁద, రమణికిఁ గనకాంబరంబుఁ గట్టించి రామకు ముత్యాల ఆవికయుఁ దొడిగి, కాంత నెన్నుదుటిపైఁ గస్తూరి దిద్ది కలకంఠికన్నులఁగాటుక దీర్చి, పొలఁతిచెక్కున దృష్టిబొట్టును బెట్టి జవ్వని వీనుల జవ్వాదియుంచి, కొమ్మనెమ్మేనఁ గుంకుమగంద మలఁది సారిది పాపటబొట్టు సూర్యచంద్రులును,మురువులు బవిరెలుముత్యాలకుచ్చు కొప్పుబిళ్ల తురాయి గొప్పముక్కఱయుఁ, బంజాలకమ్మలు బన్నసరాలు కంటసరుల్ ముద్దుకంటె తాళియును, నొఱపైన కుతికంటు నుత్తరిగెలును దండలు తాయితుల్ తళుకుగాజులును, చేకట్లు కడియముల్ చేసరంబులును పంచరత్నంబుల బటువుంగరములు, గంటలమొలనూలు గొళసరములు మురుపైన యొడ్డాణమును పందియలును, నాదిగాఁగల్గిన యాభరణములు కాంతిమతికిని శృంగారించిరపుడు.

వా. ఈలాగున బాలఁగంటికి లోలవిలోచనలు కైసేసి కళ్యాణమండపం బైన కళ్యాణవేదికకుఁ దోడి తెచ్చిరఁట యెటువలెను.

ద. చెలులు గాంతలు గొల్వ పిన్నలు పెద్దలును శోభిల్ల గాఁ, గాంతిమతివచ్చెఁ గళ్యాణవేదికకు

వా. అత్తఱి నత్యాదరంబున ముత్యాలసేసలు చల్లుచు భాసురగుణసాంద్రుండగు రాజచంద్రుండు విజయరాఘవమహీంద్రు నెదురుకొ నెనంట యెటువలెను.

ద. ఎదురుసేసలు చల్లుచు నెలమి విజయరాఘవుని
ముదమునఁ దోడితెచ్చి ముదితలఁగూడ
పదయుఁడై యలరాజచంద్ర భూపాలుండు
ఉదిరి పెండ్లిపీఁటపై నుంచె వేడుకను.

వా. ఈవిధంబున నావధూవరుల భద్రప్రదం బగుకాంచనభద్రపీఠంబున నుంచినయనంతరంబ హితమతులైన పురోహితులు వివాహసంకల్పంబు నడపించిరఁట యెటువలెను.

సంకల్పము. శుభే శోభనే ముహూర్తే ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమానే వ్యవహారే చాంద్రమానే శుభకృన్నామ సంవత్సరే ఉత్తరాయణే వసంతర్తౌ చైత్రమాసే శుక్లపక్షే అద్యపంచమ్యాం శుభతిథౌ గురువాసర యుక్తాయాం శుభనక్షత్ర శుభయోగ శుభకరణ యుక్తాయాం అస్యాం శ్రీరఘునాథభూపాల కుమారస్య అచ్యుత విజయరాఘవ భూపాలస్య ఉద్వాహాఖ్యం కర్మకరిష్యమాణ తదాదౌ వృద్ధ్యర్థం శుద్ధ్యర్థమభ్యుదయార్థంచ మహాజనైస్సహ పుణ్యాహవాచనం కరిష్యే.

తదేవలగ్నం సుదినంతదేవ తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి.
సుముహూర్తో స్త్వితి భవంతో బ్రువంతు సుముహూర్తమస్తు సుప్రతిష్ఠితమస్తు.

వా. అని యీవిధాన దేవతాహ్వాన నాంద్యగ్నిముఖ స్నాతకవ్రత పునః పుణ్యాహవాచన అంకురార్పణ కన్యావరణ మంగళాష్టక నవవస్త్రధారణ మంగసూత్రధారణ వివాహ ప్రధానహోమాది శుభకర్మంబు లాచరింపఁ జేయించుసమయంబునఁ బురోహితుల కొకరికొకరికి సంవాదంబు నడచెనఁట యెటువలెను.

పురోహితుల మాటలు.

కొండుభట్లమాట— అవునోయి యల్లుసోమయాజులు నూగుతరాలనుంచి యీయింటికి తగులైన పురోహితుండనే నుండంగా నీ వెవ్వండి కొడుకవు నా స్వాతంత్ర్యం కొంగుముడిగాక తీసుకపొయ్యేటట్టుగా. ౧

యల్లుసోమయాజులమాట— యేమోయి కొండుభట్లు మాతాతను చవ్వప్పనాయనివారు పాంకెన పంథావన కట్టడ నేశివుండంగా నీ వెవ్వండవు అపహరించుకపొయ్యేటట్టుగా మాయన్న కొడుకవా. ౨

వోభళభట్లమాట — అవురా వరసంభట్టిగా నగరింటి సహస్రనామపూజకు సువర్ణాపుష్పాలు గలవే అవల్లా అపహరించి బదులుగా ములాముచేసిన పూలు తెచ్చి వేస్తివే యిది నగరివారు వింటే అట్లాగే శేయించరా యిది యెంత లేదని కనిపించుకాకవుంటే నీవాడనా మరి. ౩

నరసంభట్లమాట—వోరి వోభళభట్టిగా నగరింటి దానధర్మాలల్లా తవాప్యర్థం మమాప్యర్థం అంచున్ను యిరుజీవి యెరుంగకుండా అంతా అంటించుకొని కాదనిపించుక పోయినవార్ని వినవా వెనకటికి, నీవైనా బుద్ధికలిగి వుండరా. ౪

మధ్యస్థం మరొక పురోహితుని మాట—వోయి వుండరోయి యిషుబడి అషుబడి యిటువంటిమాటలు నగరబడెనాయనా అందరికి బహుశ్రేయన్ను వచ్చీనే। నగర వచ్చిన ఆదాయమల్లా సరిగా పంచుక తీసుకుందామోయి మనలో మనమేనా కొట్లాట। యింతట చాలించరోయి ౫.

వా.ఆసమయంబున ముత్తైదువలు జాత్యనుగుణముగా మాట లాడిరట యెటువలెను.

రంగావోఝుల తిమ్మక్కమాట—యేమో ప్రోలుభట్ల యల్లమ్మ నగరింటి పెండ్లి నాడయినా వొకవక్కబ్రద్ద వేసుకొని నమలరా దమవో ౧.

యల్లమ్మమాట—అవునషే రంగావోఝులతిమ్మక్క, నాకు వక్కబ్రద్దా వొకటి కొదవా చాలుచాలు నిన్నమావారు సుక్కారారం సంతలో పిండికూరకం చున్ను గానుగబిండి దెచ్చిరి పెండ్లివందిట్లో నోరు మెదలించవలెనంచున్ను యింత దెచ్చుక తించునా నింతే ౨.

తిమ్మక్కమాట—ఓ పొరుగింటి తిమ్మావధానిపెండ్లాం వీరమ్మ పాటలు బాడు చున్నది. అంటుకొని నీవున్ను పాడ్రాదమవో ౩.

యల్లమ్మమాట—యిదేందో నీవు నాగవసానివై పెద్దతనం చేసుక వుండేదాన వున్ను కడమవారు పాటలు బాడే వారున్నా ౪.

తిమ్మక్కమాట—వోకమ్మా మాయింటి ఆయన యెందుకో యెమషో యేవేశా రమ్మంచున్నారు. నాకు పాటలు బాడేటందుకున్ను ప్రొద్దు వున్న దషే, మాపుట్నింటిలో వుండేప్పుడు కొండవీటి సర్వముచేత పదినుడుగులు నేర్చుకొంటి పాడుదునో అంటే శిగ్గవుచున్నది, యిక్కడంతా ముగవారే వున్నారు. నీవు ధవళమెత్తు నేనుంగూడా పాడేగాని ౫.

వా.అనిన విని ధవళంబు పాడిరట యెటువలెను.

ధవళం—జయజయ తంజపురవాసా, జయజయ మంజుళహాస

జయజయ మదనవిలాస, జయజయ మన్నారుదాస। ౧।

జయజయ సుజనవిధేయ, జయజయ సమరగాంగేయ

జయజయ దానరాధేయ, జయజయ దక్షిణరాయ ॥ ౨ ॥
జయజయ రఘునాథసంభవ, జయజయ విక్రమభార్గవ
జయజయ విజయవైభవ, జయజయ విజయరాఘవ ॥ ౩ ॥

వా. తదనంతరంబ శోభనంబులు పాడిరంట యెట్లనవలెను.

శోభనము—చోళాధినాథునకు శుభకీర్తి సనాథునకు
బాలార్క తేజునకు భామామనోజునకు ॥ ౧ ॥
కనకాచలధీరునకు కవిజనమందారునకు
మనసిజవిలాసునకు మన్నారుదాసునకు ॥ ౨ ॥
భుజవిక్రమసాంద్రునకు భోగదేవేంద్రునకు
విజయబలోపేంద్రునకు విజయరాఘవేంద్రునకు ॥ ౩ ॥

వా. ఇవ్విధంబున నవ్వధూవరులకు గురుగౌరవంబు మెఱయు కులగురుండును, వాచాలకులైన యాచార్యపురుషులును బ్రాప్తైశ్వర్యులైన యాప్తజనులును దంత్రవిధాననిపుణులైన మంత్రిప్రవీణులును బూర్వసంబంధులైన సర్వబంధువులును ననన్యసామాన్యులైన మన్నారాజన్యులును అసమాన శూరులైన హాసమువారును నత్యామోదంబున ముత్యాలసేస లిడ నద్వంద్వులైన విద్వజ్జనులును, జాతురిమీఱ హేతువాదంబులు సేయ ననీయకవనభరులైన కవివర్యులు హృద్యానవద్యతరగద్యపద్యంబులు ప్రసంగింప గాయకనగాయనీజనులు వీనులవిందుగా గానంపుసోన గురియింప నటచేటవీతమర్ద విదూషకవందిమాగధ వైతాళికబృందంబు లందంబుగా నభినందింప రంగారు సంగీతమేళంబు సేయ దుందుభిధ్వనులచేఁ బ్రతిధ్వనులు మెఱయ సువాసినీజను లాశీర్వదించి యభిరతిచేత నారతు లిచ్చుసమయంబున హితులైన పురోహితులు వివాహశేషహోమంబులు శేఖరించువేళఁ గులక్రమాగత శుభాచారానుకూలంబుగా బాలునకు లీలఁగా బాలలు జోలలు వాడిరంట యెట్లనవలెను.

జోజోజో రాజగోపాల, జోజోజో జితశిశుపాల, జోజోజో గురుశిశుపాల జోజోజో ....మాపాల ॥ ౧ ॥

జోజోజో బాణాసురారి, జోజోజో చాణూరవైరి, జోజోజో వేణుగానాసుకారి, జోజోజో శోణపద్మావిహారి ॥ ౨ ॥

జోజోజో గోపికాజార, జోజోజో నవనీతచోర, జోజోజో జగదాధార, జోజోజో నందకుమార ॥ ౩ ॥

జోజోజో రమణీయశీల, జోజోజో సత్యభామావిలోల, జోజోజో యమునాకూలలీల, జోజోజో [illegible] ॥ ౪ ॥

జోజోజో మహితానుభావ, జోజోజో యతులప్రభావ, జోజోజో సత్త్వ గుణస్వభావ, జోజోజో మన్నారుదేవ ॥ ౫ ॥

వా. తదనంతరంబ ముదం బంకురింప నామదనమోహనాకారుండగు మన్నారుదాసధీరుండు, ఆనగర దొరలతో విందారగింప గారవంబున నారాజచంద్రమహీంద్రుండు చోళభూతలనేత యైనజామాతకుఁ దనయునుంగుఁగూఁతునకు నిస్తులనస్తువాహనాభరణంబు లరణంబుగా నిచ్చెనఁట యెటువలెను.

కవివచనము.

సీ. రాజచంద్రవిభుండు రతనాలకడియముల్ కదునించు ముత్తేల కంటసరులు
ఘనమైనచౌకట్లు కంఠమాలికయును వెలయెచ్చు చుఱుకుకెంపులతురాయి
పలకవజ్రంబుల బాగైనపదకంబు చెలువైన పచ్చలచిలుకతాళి
పగడంపు పిడివంకి బలవైరివజ్రము న్వేరు గల్గినయట్టి పిడికత్తి
ప్రబలు నైరావతము మించు భద్రకరులు, నఖిలలక్షణయుతజవనాశ్వములును
హేమగిరి నైనఁ దృణముగా నిచ్చునట్టి, యల్లునకునిచ్చె నప్పుడు హర్షమునను.

సీ. వెలలేని తొడవులు వింత లౌ కోకలు అవికలు పానస్త్రీంగుమీఱు
రతనాలమంచముల్ రాణించు పఱుపులు చెలువైన యొరగులు తలగడలును
బాగుమీఱినయట్టి బంగారుబొమ్మలు పంచవన్నెచిలుకపంజరములు
కస్తూరివిణెలు గందంపుమ్రాఁకులు జవ్వాజిపిల్లులు జాలివీఁటఁ
జెలుల దాదుల మఱియుదాసీజనంబుఁ,బరఁగఁగా నిచ్చెఁదనముద్దుపట్టికపుడు
ఘనతచేఁ బదిలక్షలగ్రామములును, బసపునకు.... నెంతయుఁ బ్రాభవమున.

వా. ఆరీతి నారాజచంద్రక్షితిపతి ప్రతిలేని శతక్రతు శ్రీనివాసతాతయాచార్యులవారి నపారధనంబుల బహూకరించి భావంబు చెలంగ విద్వత్సంభావనలు సేయుసమయంబున నగ్రసంభావనకు విద్వత్కవులకుఁ బరస్పర సంవాదంబు నడచెనఁట యెటువలెను.

మల్లుభట్లమాట-యేమిరా కృష్ణంభట్టిగ, అగ్రస్థానానికి నే యోగ్యుండనై వుండంగా నాముందర యెషువలె గూర్చుందువురా వజ్రకుంఠవు. ౧

కృష్ణంభట్లమాట-అదేమిరా మల్లుభట్టిగ కామదేవుండు వచ్చినప్పుడు "సంఖ్యే సంఖ్యే శంఖభంగప్రసంగః" అనిపించి సంకులు పెంకులు జేశినవాండను నేనుండంగా నీకు అగ్రసంభావన వలదా మరి. ౨

పల్లకిచెరి యల్లంభట్లమాట-అదేమిరా తిప్పాభట్టిగా మరస్తివా నేరెల్లయల్లావధానిని వర్ణక్రమములో తప్పుబట్టి ప్రాతిశాఖ్యలక్షణం తప్పెనని చెంప గొట్టితిమే। అటువంటి యోగ్యుండు నీదృష్టికి చాలకపోయెనా। యిదిగోరా

అగ్రసంభావనకు పాత్రము। యిదిగో ముడివేస్తిరా యొసండినైనా యెత్తుమను చూతాముగాని. 3

తిప్పాభట్లమాట — వారి పల్లకిచెరి యెల్లంభట్టిగ పెదనాయనవారి సముఖాన మీమాంసయందు ప్రసంగం వచ్చినప్పుడు అయూధికరణానకు పూర్వపక్ష సిద్ధాంతాలు యెరుంగలేక పోతివే ప్రపంచమిథ్యాత్వం ఖండించినపుడు యీనో రెండు బోయరా యిప్పు డేమాయ శబ్దతర్కమీమాంసాయందు ప్రసంగం శేయుదామురా నీగుట్టు బయలు శేశేను. ౪

వా. అని సంవాదము చేయువిద్వత్కవిరాజులకుఁ జోళ్లు సరిపెణలుఁ గుంచె కాళాంజులు డవిణములహారులు మొదలైన బహుమానములు చేసి యథోచితంబుగాఁ బ్రధానమంత్రిదళకర్తల ననువర్తించిన యనంతరంబ తనముద్దుపట్టి కేమని బుద్ధులు దెలుపుచున్నాఁడు.

రాజచంద్రుఁడు చదివే పద్యాలు.

క. అక్కా దగ్గఱ రమ్మని, యక్కునఁ జేర్చుకొని చాల హర్షము మదిలో
నెక్కొనఁగ శిరసు మూర్కొని, చక్కని తనపట్టిఁ జూచి జనకుం డనియెన్.

సీ. ప్రేమతో నినుఁ బిల్చి ప్రియుఁ డాసంగక నీవె వివరించి మున్నుగా వేఁడకమ్మ
బహుమానముగఁ బిల్చి పతి నీకొసంగినఁ గొంచె మంచును నీవె కొసరకమ్మ
నెనరుతో రమణుండు నినుఁ బిల్వఁ బంపిన నేయెడలను జాగు సేయకమ్మ
ప్రాణవల్లభుఁడు ని న్రావింపకయ మున్న బలిమిదగ్గఱఁ బోయి నిలువుమమ్మ
భర్తలాలించె నని హెచ్చి పలుకకమ్మ, మగనిమాటలకును మాఱుమలయకమ్మ
ప్రాణనాయకు మతము చేపట్టవమ్మ, విభుఁడు దైవంబటంచు భావింపవమ్మ.

వా. అని యీవిధాన బోధించి ధన్యతరయైన కన్యకామణి నాచార్యశిఖామణి చే నొప్పగించెనఁట యెటువలెను.

ద. బిలాహరి. ఆచార్య నిను నమ్మి యాత్మజ నిచ్చితి,
నీచిన్నపడుచు గోల యేమియుఁ దెలియదు ॥ ౧ ॥
వేమాఱునీతోడ విన్నవించెదనయ్య,
ప్రేమతో నేలుమని ప్రియతనయునికిఁ దెలుపు ॥ ౨ ॥
ఏవుమీఱంగ నవతు లిందఱిలోన,
నావట్టిఁ జేపట్టి నడవు మనవయ్య ॥ 3 ॥
బహుతపంబులు సేసి భామనుగంటిని,
మహిమతో నేలు మని మన్నారుదాసునకుఁ దెల్పు ॥ ౪ ॥

వా. ఆతీరున నాతంజావురాధినాథునిచేఁ దనకూఁతురి నప్పగించె నఁట యెటు

ముఖారిరాగము - ఆది - దరువు.

విజయరాఘవేంద్రా నావిన్నపమువినవయ్యా, ప్రజలెంచనేఁ జేయుభాగ్యంబుకతన॥ అల్లుండవైతి వీవందఱుఁ గొనియాడ, నెల్లరాజులలోన నే ధన్యుండనైతి ॥ ౨ ॥ ముసుత నేసాఁకినమందెమేలౌమునఁ, గమలాక్షి చెల్లుబడిగా నుండు నెపుడు ॥ ౩ ॥ నేర్పునేరములెల్లనీ వెసైరింపుచు, నోర్పుతో నేలుకోవోయయ్య మాసుతను ॥ ౪ ॥

వా. అని తేజంబు మీఱ రాజచంద్రమహారాజు హెచ్చుగా నచ్యుతవిజయరాఘవసార్వభౌముని నుచితంబుగా నుపచరించి యావధూవరుల భావంబు రంజిల్ల రక్తాబ్జనాయికారాజగోపాలకుల సేవింపఁజేయించి తంజాపురప్రవేశంబు చేయింప నాకాంతిమతీవిజయరాఘవేంద్రులు జోడుగూడి నటించిరఁట యెటువలెను.

కళ్యాణి—ఆది - ద.

కాంతిమతినిం జోడుగూడి ఘనుండు విజయరాఘవుండు, సంతసంబున నటియించె సభవారుపొగడ.

వా. తదనంతరంబ ముదం బంకురింప నెంతయు సంతసంబునఁ గాంతిమతి తన చాతుర్యంబు పొదలఁ బద కేళిక వినుపించెనఁట యెటువలెను.

ఘంటారవము - విజయభూషణము.

వలపునిలుపలేరా చెలువమన్నారుదాసధీర, అలరువిల్తునిబారి సైరింప॥గ॥పల్లవి. ఏలుకోరా మ్రొక్కేరా, చాలదయదానరా, సామి విజయరాఘవ ॥ ౨ ॥ దక్కితి నిపుడు నీకుఁ దమి దాఁపనేలరా, పుక్కిటి విడెమిచ్చి బుజ్జగింపుచు నన్ను, అక్కునఁ గదియించి యాదరింపుచుఁ బ్రేమఁ। జక్కని మన్నరుదాస ........నీవేళ ॥ ౩ ॥ ఏలుకోరా.

కవివచనము.

సీ. భాసిల్లు రాజగోపాలవిలాసంబునందు సువర్ణసింహాసనమున
నాకాంతిమతి మొదలైన ప్రియాంగనల్ గోరి యిర్వంకలఁ గొలువుసేయఁ
బొలుపొందఁ గొలువుండి పుత్రులు పౌత్రులు తామరతంపరై దండఁదనర
నలశ్రీనివాసతాతాచార్యవర్యుండు సరసప్రసంగముల్ సారె సేయ
సకలతారావృతుం డైనచంద్రుఁ డనఁగ, విశదనిజకీర్తిచంద్రికల్ దిశలవెలయ
విజయరాఘవమేదినీవిభువరుండు, చెలఁగుచున్నాఁడు శోభనశ్రీలు వెలయ.

భరతవాక్యము.

అని యివ్విధంబున రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమాన సారసారస్వతధురీణయు విచిత్రతరపత్త్రికాళికలిఖిత వాచికార్థావగాహనప్రవీణయుఁ దత్ప్రతిపత్త్రికాళికస్వహస్తలేఖనప్రశస్తకీర్తియు శృంగారరసతరంగితపద

కవిత్వమహనీయమతిస్ఫూర్తియు, నతులితాష్టభాషాకవితాసర్వంకష మనీషావిశేషశారదయును రాజనీతివిద్యావిశారదయును విజయరాఘవమహీపాల విరచిత కనకాభిషేకయు విద్వత్కవిజనస్తవనీయవివేకయు మన్నారుదాసవిలాసోషాపరిణయమహాప్రబంధనిబంధనకృతలక్షణయు, మహనీయరామాయణభాగవతభారతకథాసంగ్రహణవిచక్షణయు, పసపులేటి వేంకటాద్రిబహుజన్మతపఃఫలంబును మంగమాంబాగర్భశుక్తిముక్తాఫలంబును రంగద్గుణకదంబయు నగు రంగాజమ్మ రచియించిన మన్నారుదాసవిలాసంబను మహానాటకరాజంబునకుఁ గథానాయకుండును, దనప్రాణనాయకుండు నైన యచ్యుతవిజయరాఘవనాయకుహేమాబ్జనాయికారాజగోపాల! - - - - సమృద్ధియు నైశ్వర్యాభివృద్ధియు సర్వశాత్రవనివృత్తియు సకలసామ్రాజ్యప్రాప్తియుఁ గలుగ లాలించి పాలింపు.

సంపూర్ణము.

---